[...]TRAL BOOK DEPOT SERIES NO. 1.

# SREE
# Aganirdayaharanam.

BY

**Palanki Suryanarayana Kavi**





Printed at the

MANORAMA PRINTING WORKS
*RAJAHMUNDRY.*
1915.

CENTRAL BOOK DEPOT SERIES NO. 1.

శ్రీ

# అపనిందాపహరణము

ఇది

పాలంకి సూర్యనారాయణకవిచే
రచియింపఁబడియె.








రాజమహేంద్రవరము.
శ్రీమనోరమా ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
1915.



[వెల 0—4—0.



శ్రీ

శ్రీమత్పరదేవతాయైనమః.

# అపనిందాపహరణము



## ప్రథమాశ్వాసము.



ఉ. శ్రీపతిమిత్రుఁడున్ విబుధసేవితుఁ డాత్మమయుండు భక్తర
క్షాపరుఁ డప్రమేయుఁ డగజాహృదయాబ్జదివాకరుండు స
ద్దీపితచంద్రచూడుఁడు జితేంద్రియుఁ డెల్లెడ మాకు సత్కృపం
బ్రాపుగ నుండఁగా మదిని బ్రార్థన సేయుదు నెల్లభంగులన్

ఉ. లోకము లెల్లఁ దా నగుచు లోన జగంబులు గల్గినట్టిసు
శ్లోకుఁడు నీలమేఘతనుసుందరుఁ డబ్జవిశాలనేత్రుఁ డా
శ్రీకలితుండు మౌనిగణసేవితుఁ డద్రిధరుండు సత్కృపన్
మా కొనగూర్చుఁ గావుత సమస్తశుభంబుల నెల్లకాలమున్

క. తాలిమి గల్గి జగంబుల
నోలిన్ సృజియించునంబుజోద్భవుపదముల్
గీలుకొలిపి మది నిచ్చలు
చాలఁగ వినుతింతుఁ గావ్యసాధనమునకున్

క. శంకరముద్దులతనయుని
వంకరతుండంబుగల్గువానిని మది ని
శ్శంకంబుగఁ దలఁతు నిరా
తంకంబుగ నామనోరథం బొనగూర్పన్

ఉ. వీణె కరంబున న్మొలయ వేల్పుపడంతుక లాడిగంబుల
న్మానుగఁ జేయుచుండ నసమానసమంచితరాగవైఖరిం
బూని పయోజపీఠమున బొల్పెసఁగం గొలువున్న దివ్యగీ
ర్వాణిఁ దలంతు నాకెపు డపారితవాగ్విభవం బొసంగఁగన్

చ. కరుణ దలిర్ప భక్తులను గాచుచు నీశ్వరునర్థదేహమై
పరఁగుచు దుర్మదాంధులను బట్టి వధించుచు మూఁడుమూర్తులం
దిరవుగఁ దానె నిల్చి సృజియింపఁగఁ బెంపఁగ సంహరింప సు
స్థిరముగ నున్నమజ్జననిదివ్యపదంబుల నెంతు నెంతయున్

సీ. రసపరిస్ఫూర్తి నుర్వర కవీంద్రులు మెచ్చు కవిత నా కిచ్చె నేఘనయశుండు
చరకబాహటాదిశాస్త్రసమ్మతిగ వైద్యము నాకుఁ జెప్పె నేయలఘుగుణుఁడు
ఆణిముత్యఁపుపేరు లౌరా యితనివ్రాఁత లని మెచ్చఁ జేసె నేయార్యనుతుఁడు
గణితంబునందునఁ గలరహస్యంబులు భువి మెచ్చఁ జెప్పె నేపుణ్యతముఁడు

గీ. కన్నతనయులకన్న నక్కజఁపుఁగూర్మి
నన్ను మన్నించె నెపుఁ డట్టి నాగభట్ల
సుబ్బరాట్కవి మద్గురు స్తుతి యొనర్తు
నిండువేడుక నామది నుండఁ జేసి

క. మున్నాంధ్రభారతమును జను
లెన్నఁగఁ దెనుఁగున ఘటించి యొసఁగించినయా
నన్నయకవిఁ దిక్కన నె
ఱ్ఱన్నను వినుతింతు మనము రంజిల్లంగాన్

గీ. కవిత యన నెట్టిదో యెఱుఁగంగ లేక
కూళతనమున సత్కవికోటిఁ గాంచి
యుపహసించెడుకుకవుల నవలఁ ద్రోచి
కడిమి మెఱయంగ వాకట్టుగా నొనర్చి

క. శ్రీగౌరీపదయుగళము
బాగుగ మది నిల్పి దంతిసదనుని వాణిన్
భోగిశయను ధూర్జటి
నాగమధరుగురుఁ దలంచి యానందముతోన్

## షష్ఠ్యంతములు.

క. పురహరునకు భవహరునకు
సరసిజగర్భాదిదివిజసన్నుతునకు శ్రీ
ధరమిత్రున కార్యాముఖ
సరసిజమధుకరునకు కంగజమదహరునకున్

# ప్రథమాశ్వాసము

క. స్థాణునకు ధవళవృషకం
ఖాణునకు గిరీంద్రచాపకలితున కార్త
త్రాణపరాయణునకుఁ బటు
బాణునకు జగత్త్రయైకభారసహునకున్

క. హరునకుఁ ద్రిపురాసురసం
హరునకుఁ గలధౌతగిరివిహారునకును శం
కరునకు మేరుమహీధర
ధరునకు హతదైత్యబాహుదండధరునకున్

క. నెరకనికరాలగనికిని
సిరినెదఁగదియించియొసఁగుజెట్టిసకునికిం
గరితొయ్యలియొదతొగచం
దురునికిపాడకోకగట్టుదొడ్డతబిసికిన్

క. నెలసికదునెదారికి బూఁ
చులయొడయని కగ్గికంటిజోగిసెలఁకికిన్
చలిదిండినగలనెగడెడి
బలునకు మిన్నేఁటిబోఁటిపలపుమగనికిన్

క. నాపసుతుకఁగలజెట్టికి
పాపలమన్నినిమిన్నపాగాదణికిన్
రూపరిపాపనికన్నెగ
దాపుగ నెసఁగించినట్టిదయ్యఁపుదొరకున్

క. శర్వునకు నిరతనుతగం
ధర్వున కసమానశూలధరున కసురను
ద్గర్వవినాశనకరునకు
నుర్వీధరశరున కద్రిజాపేతునకున్

క. ఈశ్వరునికి సతవినుతక
వీశ్వరునికి మిత్త్రికిన్నరేశ్వరునికి భూ
తేశ్వరునికి సత్త్వమధగ
ణేశ్వరజనకునికి వేల్పుటేఁటిమగనికిన్

క. సదయునకు నంధకాసుర
మదహరునకు ధృతకురంగమౌళికిని శివా
స్వదపదయుగళున కాశ్రిత
హృదయాబ్జదివాకరున కహీంద్రధరునకున్

క. శంభునకు నసురభూధర
దంభోళికి మేరుచాపధరునకు సశివా
రంభునకును జలనిధిసమ
గంభీరున కసమనేత్రకమనీయునకున్

క. ఈశునకు ధవళతనుసం
కాశునకును బ్రణుతమౌనిగణయుతునకు భూ
తేశునకు హరిణధరున కు
మేశునకును విజితరాక్షసేశసఖునకున్

వ. సద్భక్తిపూర్వకంబుగా

సీ. శ్రీమన్మహాశాంకరీపదంబుల నమ్మి నిరత మర్చించు భూసురవరుండ
వసుధ శ్రీపాలంకివంశప్రదీపకుసూరయ వేంకటసుబ్బమాంబ
సుతుల మూఁడవవాఁడ సూరనాహ్వయుఁడ వేంకననారసాంఖ్యుల కనుజుఁడను సు
సాధ్వి సుబ్రహ్మణ్యసతి వరించినవాఁడ బుధవిధేయుఁడ సర్వభూతహితుఁడ

గీ. నర్పణము సేయ నెంచితి నఖిలపాప
హారముగా నపనిందాపహరణ మనెడు
సత్ప్రబంధంబు దీనిని సత్కవీంద్రు
లాదరింపంగ బల్కెద నవలికథను

---

## కథాప్రారంభము.

—:0:—

క. ఘనమునిశోభితనైమిశ
మున శౌనకుఁడాదిగల్గుమునులెల్లను సూ
తుని సకలార్థవిదుం గని
వినయంబునఁ బల్కి రిట్లు విమలచరిత్రా

క. హరుతనయుఁడు గజముఖుఁడై
పరఁగుట విస్మయమ దేమి పరికింప నిశా
కరు భాద్రపదచతుర్థిని
నరయరు సితపక్షమున గుణాఢ్య దెలుపవే

క. అని పలుకుమునులపలుకులు
విని సూతుఁడు దివ్యదృష్టి వెలయించి మనం
బున గతవృత్తాంతము న
త్యనుపమశక్తిని గ్రహించి యతఁ డిట్లనియెన్

శా. దేవారాతి గజాఖ్యుఁ డస్మని జనద్వేషప్రభావుండు స
ద్భావం బీశ్వరపాదపద్మములపైఁ బ్రఖ్యాతిగా నిల్పి యు
ద్గ్రీవాస్యం డగుచున్ దివాకరునిపై దృక్కుల్ వ్యాస న్నిల్పి యూ
ర్ధ్వావాసు ల్వ్యాస బ్రమగ్గ నుగ్రతపమున్ రౌద్రాకృతిం జేసినన్

క. శంభుం డాశ్రితరక్షా
రంభుం డగజాతనయనరాజీవార్కుం
డంభోధిసదృశఘనతర
గంభీరుఁడు దైత్యమౌళిఁ గన్పట్టి దయన్

క. మెచ్చితిని నీతపంబున
కచ్చెరు వందిరి సురేంద్రుఁ డాదిఖచరులున్
ఇచ్చితి సర్వార్థంబుల
నిచ్చ చనఁగఁ గోరు మెద్దియేని వరంబున్

వ. అని ప్రసన్నుం డైనపరమేశ్వరుం గాంచి ముకుళితకరకమలుం డై కుంజరా
సురుండు

క. విశ్వోత్పత్తికి ధాతవు
విశ్వము రక్షించుతఱిని విష్ణుఁడవు తుదిన్
విశ్వము లయింప హరుఁడవు
విశ్వేశ్వర చిత్స్వరూప విశ్వాత్మ హరా

దండకము. శ్రీమన్మహాదేవ దేవేశ యీశా మహేశా వృషాధీశ కాత్యాయనీశా
పరేశా మరాత్మప్రణాశాంతరాశాంతకీర్తిప్రకాశా హరా పాపసంహారకారా!

మహాకాళ విశ్వేశ్వరా ఘోరనాగేంద్రహారా మహామేరుధీరా నిస్తుత్యవిద్యా
ధరా యీశ్వరా వీర సద్భక్తమందార తారాద్రిసంచార సద్వ్యాఘ్రచర్మాం
బరా శూర కారుణ్యపాథోనిధీ ధీనిధీ లింగ గంగాధరా పాండురాంగా సము
త్తుంగ యుద్యచ్ఛతాంగా మహాదేవ మృత్యుంజయా కృత్తివాసా మహోల్లాస
పంచాననా వామదేవా విరూపాక్ష భర్గా లసత్పుణ్యమార్గా శివా శర్వ సర్వజ్ఞ
సర్వాత్మకా శూలధారీ త్రినేత్రా సుగంగాకళత్రా పవిత్రా సురస్తోత్ర
శంభూ దయాంభోధి శుంభద్గళా చంద్రమౌళీ పినాకీ కపర్దీ నమస్తే నమస్తే
నమస్తే నమః.

గీ. ఆదిమధ్యాంతశూన్యుండ వై తనర్చు
నీప్రభావంబు వర్ణింప నేర నభవ
చంద్రశేఖర పురహర శత్రుమదవి
భంగ సారంగధర ధృతగాంగ లింగ

గీ. కరుణ గల దేని నా కొకవర మొసంగు
మీశ సర్వేశ నీవు నా హృదయ మందుఁ
బాయకొని యుండఁ గోరితి భవ్యచరిత
భక్తజనవర్తి గురుకీర్తి భవ్యమూర్తి

క. అని వేఁడఁ గుంజరాసురు
ఘనతరభక్తికిని మెచ్చి కరకంఠుఁ డా
తనిహృత్కమలాంతరమున
నణురూపము దాల్చి యుండె నానందముతోన్

గీ ఇట్టు లుండంగఁ బార్వతిఁ కిందుధరుని
రాక దెలియమి దలఁప గీర్వాణు లెల్ల
సకలలోకంబు లరసి వేసరి గిరీశు
రాణి కెఱిఁగించి కడువిచారంబు గదుర

సీ. అర్ధాంగమును బూని యలరారుచున్న భవాని కైనను దెల్ప వలదె కొంత
నిరతంబుఁ దనపాదసరసిజంబులు గొల్చునందికిఁ దెల్పఁ దేమందు మింక
సర్వకాలంబుల సాన్నిధ్యవర్తి యై చెలఁగుభృంగికిఁ దెల్ప వలదె కొంత
ఆదిదేవునిభక్తి నారాధనలు సేయుప్రమథుల కైనఁ జెప్పంగ వలదె

గీ. సురల కెఱుఁగంగ రాదు కిన్నరులు దెలియఁ
జాల రెచ్చట వసియింప నూలుకొనెనొ
భక్తవశుఁ డౌట నెవ్వనిపజ్జ నిలిచి
నాఁడొ మృత్యుంజయుండు దా నేఁడు లేఁడు

వ. అని వితర్కించి గౌరీప్రార్థనంబు సేసి

చ. సరసిజగర్భుఁ జేరి మునిసంఘముతో సుర లెల్ల మ్రొక్కి యో
పరమకృపార్త్త దీనజనపాలన శంకరుఁ డెందుఁ దాఁగెనో
యరయ నశక్య మయ్యె భువనావళి నెంతయుఁ జూచి చూచి వే
సరితిమి పంకజాసన ప్రసన్నమనస్కుఁడ వై వచింపవే

క. అన విని వనజోద్భవుఁ డా
ననములు నిగిడించి యూర్ధ్వనయనుం డై దై
త్యుని హృదయావర్తి యగుహరుఁ
గనుఁగొని నిర్జరుల కనియెఁ గడు భీతిమెయిన్

చ. అమరవరేణ్యులార ప్రమథాధిపుఁ డీశ్వరు డంబికేశ్వరుం
డమితశుభప్రదుం డట గజాసురహృత్కమలప్రవర్తి యై
విమలమతిం జెలంగి బృధివీధరరాట్తనయన్ శుభాకృతిం
గమలదళాక్షి నైన గనఁగా మదిఁ గోరఁ డదేమి చిత్రమో!

క. రాక్షసుఁడు భయదముఖతా
మ్రాక్షుఁడు రాత్రించరప్రజాధ్యక్షుఁడు ఘా
లాక్షు నెటువిడుచు నాహవ
దీక్ష వహించినను గ్రుంగు దేవప్రజమున్.

క. దేవుని విడిపింపఁగఁ బ్రతి
గావింప రథాంగపాణి కంజాక్షుం డా
భావజజనకుఁడు శ్రీహరి
గోవిందుఁడు గాక యొరులకుం దర మగునే.

ఉ. కావున మీర లాహరిని గాంచి గతం బెఱిఁగించి యమ్మహా
దేవుని భావజాంతకుని దెచ్చునుపాయ మెఱింగి వచ్చినం
బోవుద మెల్లదివ్యపదభూషితులు న్సురవైరిపాలికిన్
శ్రీవిభుతోడఁ గూడి బుధశేఖరులార విచారమేటికిన్.

క. అనిపుత్తెంచిన సురవరు
లనిమిషవిభుఁ గూడి చని గదాగ్రజు శౌరిం
గని ప్రస్తుతించి గతమును
వినిపించిరి తెల్లముగ వివేకముతోడన్.

క. విని దానవాంతకుఁడు హరి
దనుజుని వధియింప నేరితర మింకులకుం
గనుఁగొంటి నొకయుపాయము
మనము గరగఁ జేసి వాని మన్ని గొనవలెన్.

చ. అది యెటు లన్న నంది గొని యాడుచుఁ బాడుచుఁ జిత్రవైఖరిన్
నటవరవేషము ల్వెలయ సర్వనిలింపులు గూడి రాక్షసా
స్పద మగుకుంజరాసురునిపట్టణ మేగి యనేకరీతులన్
మది గరగించి గోరిన యుమాపతి నిచ్చు నతండు ప్రీతిచేన్.

వ. అని యానతిచ్చిన

క. రావించిరి వృషభము నట
గావించి రలంకృతులఁ బ్రకాశముగాఁగన్
భావించి రపుడు హరుఁ గొన
సేవించిరి సర్వవిబుధసింహులు దానిన్.

వ. ఇట్లు సమకట్టి చని గజాసురసదనపురోభాగంబున

సీ. పరమాదరమునఁ దుంబురునారదాదులు దలకొని చుషిరవాద్యములు సేయఁ
జతురాననుండు భాస్వరశబ్దవైఖరి నతరీతులను తాళగతులు దెలుప
జంభాసురారాతి గంభీరనినదమృదంగధ్వనుల మేను వొంగఁజేయ
పణవకాహళఢక్కాపటహాదిఘోషముల్ విబుధులు వేడ్కఁగావించు చుండ
గీ. భువనవర్గంబు లరచేత బూని తనదు
మాయచేఁ గప్పి విస్మృతి వాయఁ జేసి
సొంపు మీఱఁగ నాడించుసూత్రధారి
వంచెకోలను బూని యాడించె శౌరి.

# ప్రథమాశ్వాసము.

గీ. ఇవ్విధంబున భువనంబు లెల్ల మోహ
మగ్న మై యుండ రక్కసుమానసంబు
పల్లవింపంగ గీతము ల్పాడ నలరి
వారణాసురుఁ డి ట్లనె వారితోడ.

క. ఏరయెడఁ గాంచి యెఱుంగని
ధీయుతి నలరించి రిట్టి తెరవునకుఁ దగం
జేయ మదిఁ బుట్టె మీ రిట
నేయది కోరినను వేడ్క నిత్తుఁ దెలుపుఁడీ.

మ. అనినం గృత్రిమవేషధారులు మహాహ్లాదంబు సంధిల్ల నీ
కెనయేరీ భువనంబులం దనుజవంశేశా! భవత్కాంతిచే
తను గాదే త్రిదశుల్ సుఖానుభవు లై దర్పించి నిర్నిద్రతన్
మనుటల్ మా కొకకోర్కె పుట్టె నది యిమ్మా వేఱుగాఁ బల్కకే.

క. అది యెట్టిదన్న విను నీ
మది నెలకొని యున్నచంద్రమౌళి మహేశున్
సదయుఁడ వై మాకొసఁగిన
ముద మందుచుఁ జనెద మదియె ముఖ్యము మాకున్.

క. పురహరుఁడు లేమి జగములు
భర మయ్యె హిమాద్రిపుత్రి బహుభంగుల దు
ష్కరదుఃఖమగ్న యై మృతి
నరయుచు నుండెన్ బ్రమాద మై నెగడుఁగదే.

క. అని పలుక నదరిపడి యా
దనుజాగ్రణి యమరవరులు తథ్యము వీరల్
కనుఁగొనక మోసపోయితి
ననఘు మహాదేవు నెట్టు లర్పింపనగున్.

గీ. తెలియ నవివేకి చేకూరు ఫలము నైన
ననుభవింపంగ లేఁడు మహాత్ముఁ డెందుఁ
దనకు సాధ్యంబు గానట్టి దాని నైన
వెలయ సమకూర్చి భుక్తి గావింపఁ గలఁడు.

క. పాపమునకు వెఱవక నే
నాపశుపతి విడువ కున్న నమరవరులతో
శ్రీపతి దెరలి రథాంగము
నాపైఁ బరపినను బ్రతుకనగునే నాకున్.

గీ. శంకరు విడిచి పృథివి నే నింక నెటులు
నైతు నీ కున్న సత్కీర్తి సమయు జగతి
నాడికల నొంది దోసంబు లనుభవించు
కంటె మృతినొంది పుణ్యలోకములఁ గాంతు.

క. అని యసుర యాకపటప
ర్తనులం గని నన్నుఁ దునిమి దర్పకహరునిం
గొని చనుఁ డే నొక్కటి మీ
యనుపమకృప గోరి వేడ్క నడిగెద వినుఁడీ.

క. అనవరతము శంకరునిం
గను కోర్కె మది న్వసింపఁగాఁ జేసిన నా
తను వతిశుభప్రదం బా
ననమును భవసదృశ మిది వినాశముగాకే.

గీ. లోకపూజ్యంబు నొందఁ బినాకి కెపుడు
నాదుచర్మంబు సద్వసనంబు కాఁగఁ
జేయుమని కోరి దానవసింహుఁ డపుడె
రయమునను దేహ మాబుధార్పణము సేసి

క. నిలిచిన కేశవుఁ డాతని
తల నిశితమహోగ్రచక్రధారాహతి భూ
స్థలి నొరగఁ జేసి రజితా
చలపతి నిటు ప్రస్తుతించె స్వర్వాసులతోన్.

క. శంభూ ప్రవిమలచరితద
యాంభోనిధి హర పురాంత కాత్యుగ్రాక్షా
శుంభద్గళ దురితద్విప
కుంభవిభేదనమృగేంద్ర గురుమూర్తివరా.

చ. దనుజుల కిట్టిఘోరవరదాన మొసంగి హృదంతరాళిన
ర్తన మొనరింపఁ బాడియె కృతఘ్నులు గారె నిశాటులెందుఁ బో
భునుతగాత్రి దుర్మదుని భస్మనిశాచరునిం దలంపవో
మునుకొని నన్ను నిన్ను సురముఖ్యుని పద్మజుఁ జంపఁ బూనుటల్.

వ. అని సబోధకంబుగాఁ బలికి పూర్వామరుని యభిమతం బెఱింగించి వాసుదేవుం డు వైకుంఠంబునకుం జనియె నట బ్రహ్మాదులును తమతమలోకంబులకుం జని ర య్యనంతరంబ శంకరుం డామృతకళేబరంబుఁ జేరం జని

క. సదమితిచర్మాననములు
భదమ్రుగాఁ బూని వృషభవాహనగతుఁ డై
యదిశరుఁ డరిగె నతని
ర్నిదుగ్రఁ డుమాదర్యనేచ్ఛ నిజపురమునకున్.

మాలిని. పరమచరితపూర్తీ భక్తలోకప్రవర్తీ
చిరతరశుభకీర్తీ శ్రీమహాదేవమూర్తీ
సురుచిరఫణిహారా సూక్తమంత్రప్రచారా
వరకుధరవిహారా వార్ధిగాంభీర్యధీరా.

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణాకటాక్షసంప్రాప్తకవితావిచిత్రాయు ర్వేదవిద్యావిపినచైత్ర లోహితసగోత్రపవిత్ర నారాయణపౌత్ర సూర్యనారాయణ పుత్ర పార్వతీపరమేశ్వరసేవాపారాయణ శ్రీ సూర్యనారాయణకవి ప్రణీతం బైనయపనిందాపహారణం బనుప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీ

శ్రీమత్పరదేవతాయైనమః.

# అపనిందాపహరణము



## ద్వితీయాశ్వాసము.

క. శ్రీశర్వాణీహృదయకు
శేశయమధుకర మునీంద్రసేవిత హర వి
శ్వేశ భవబంధపటలవి
నాశ విశాలప్రకాశ నందీశ శివా.

వ. అవధరింపు మట్లు సూతుండు ప్రమథానులతో శంకరుండు కైలాసంబున కరిగె ననిన

క. విని శౌనకాదిమును లి
ట్లనిరి మహాదేవుఁ డట్లు లరిగి పిదపఁ దా
నొనరించిన దే మది చ
య్యన వినిపింపుము మహాత్మ యమలచరిత్రా.

క. అనినన్ సూతుం డపు డా
మునిజనములఁ గాంచి పల్కె మోదమున విభుం
డనుకూలతఁ జను దెంచుట
విని హైమవతీలలామ వేడుకతోడన్.

సీ. అభ్యంగనస్నాన మాచరింపఁగ నెంచి యంతిపురంబున కరుగ నొకతె
సంపెఁగనూనెచే సొంపుగాఁ దలయంటి కమ్మకస్తూరి చక్కఁగ నలంది
పునుఁగు జవ్వాజి నింపుఁగ మేని పైఁ బూసి కర్పూరకుంకుమాగరులు చేర్చి
తగురీతిఁ బరిమళద్రవమేళనము సేసి పలుమాఱు నింపుగా నలుఁగు వెట్టె

గీ. నుద్భవం బైనపిష్టము నొక్క విగ్ర
హంబు గావించి పాశాంకుశంబు లొసఁగి
పరులఁ జొరనీకు మని తెల్పి ద్వారమందుఁ
థిరముగను నిల్పెఁ బ్రాణప్రతిష్ఠఁ జేసి.

వ. ఇట్లు గావించి నాయాజ్ఞ యగునంతపట్టు లోనికిం బురుషుల రానీయ వలదని యెఱింగించిన నతం డద్దేవియెడ

గీ. మాతృభావంబు గల్గి భీమప్రచండ
కలితపాశాంకుశంబుల నలరి యతఁడు
భద్రముగ నుండె నంత భవాని గౌరి
సలలితం బైనపన్నీఁట జలక మాడి.

క. మే నొత్తికొని దుకూలము
నానారీమణి ధరించి యఖిలభూషణముల్
తోన ధరింపఁగ ముకురముఁ
బూని నిజాననవిలాసమును జూచు నెడన్.

క. హరుఁ డటు నక్తంచరహృ
త్సరసిజ మెడఁబాసి రజితశైలగతుం డై
గిరిజాసందర్శనత
త్పరతన్ భవనంబుఁ జొచ్చుతఱి నుగ్రుం డై.

గీ. భీమబలుఁ డైనశాంకరీప్రియసుతుండు
లేచి యెవ్వండవోయి యీలీల నన్ను
సరకుగొనకుండఁ బోవంగఁ జనునె నీకు
నిలునిలు మటంచు నడ్డంబు నిలిచినంత.

శా. ఫాలాక్షుం డపు డుగ్రుఁ డై కడఁగి శుంభద్విక్రమస్ఫూర్తిచే
శూలం బుద్ధతి కేలఁ బూని గిరిజాసూనుం దెగంజేసినన్
లీలాంగం బటఁగూలి దచ్ఛిరము ప్రాలేయాద్రిజోచ్ఛక్తిమై
బాలార్కప్రతిమానసద్ద్యుతి సురవ్రాతంబుచేరం జనెన్.

వ. ఇత్తెఱంగున వధియించి శంకరుండు.

క. అంతిపురంబున కేఁగఁగఁ
గాంతామణి లేచి యభిముఖంబుగఁ జని య
త్యంతరయంబున విభునకు
వంతసమున మ్రొక్కి వినుతి సల్పి మహాత్మా.

క. జడమతి వై నన్నీగతి
నెడఁబాసి చనంగ నగునె యెందును మున్నీ
ఎడువున సతులను వెతలం
బడఁ జేసినవారు గలరె భవ్యచరిత్రా.

గీ. సదయుఁడ వటంచు నిన్ను నాసను వరించి
నాశరీరంబు భవదధీనంబుఁ జేసి
పతియు గతియును నీ వని భావమందుఁ
దలఁచి నిన్గొల్చు టెఱుఁగ వో ధన్యచరిత.

క. లలిఁ బాణిగ్రహణంబునఁ
బలికినపల్కులు మృషాప్రబంధంబులుగా
నిల నన్ను విడిచి చని యిటు
లలయించుట నీకు ధర్మ మగునె మహాత్మా.

క. అని వినయాన్విత యై య
వ్వనజాక్షి యుమావధూటి వచియించినఁ దా
ననియె నిటు హరుఁడు భక్తుని
ఘనకామ్య మొసంగఁ జనితిఁ గాకేమిటికిన్.

వ. అని సందియంబు వాయం బలికి గజాసురుని భక్తిప్రవర్తనలును తా నట వసి
యించుటయుఁ గేశవాదు లరుదెంచుటయు నతండు తన్నొసంగుటయుఁ దా
నసురచర్మవస్త్రంబులం దెచ్చుటయు మొదలుగాఁ గలవిశేషంబు లెఱింగించి
యప్పార్వతి నలరించి యుచితస్థలంబున వసించి.

క. వాకిటఁ దుందిలుఁ డొక్కఁడు
ప్రాకటభుజవిక్రముండు పాశాంకుశముల్
చేకొని సత్వరుఁ డై నను
భీకరగతిఁ గదిసె రోషభీషణముఖుఁ డై.

గీ. ఎవ్వఁ డాతఁడు దా నిట కేల వచ్చె
నంతిపురిఁ జొచ్చి యుండు టత్యద్భుతంబు
చీమయుఁ బురుషరూపముచేత నిటకు
రా వెఱచుఁ గద పూర్ణిమారాజవదన.

వ. అని సవిస్మయంబుగా నడిగిన.

క. సూర్యసముం డగుపుత్త్రుని
ధైర్యంబున కెదను మెచ్చి దాక్షాయణి యో
యార్య భవత్సుతుఁ డతఁ డని
యార్యామణి దెలిపె నప్పు డతనిజననమున్.

క. విని చంద్రశేఖరుం డా
ననమున దైన్యంబు దోఁప నళినేక్షణ యా
ఘనసుకుమారుఁ గుమారుని
దునుమాడితి నకట విషయదూరుఁడ నగుచున్.

క. అని పలుక గుండె ఝల్లన
కనుఁగవ బాష్పములు రాలఁగా గౌరి వెసన్
ఘనశోకమగ్న యైనం
గనిశంకరుఁ డనియె బ్రతుకఁగాఁ జేతు సఖీ.

గీ. దుఃఖ మందంగ వల దని దుర్నిరీక్ష్య
మై చెలంగు గజాసురమస్తకంబు
దెచ్చి మొండెంబునకును సంధించి మరల
జీవము లొసంగి యాతనిఁ జేరఁదీసె.

గీ. రాణి కర్పించె సర్వగీర్వాణు లలర
నావధూటియుఁ బుత్త్రు నత్యాదరమున
నెత్తి కౌఁగిటఁ జేర్చి చన్నిచ్చి వాని
గజముఖుం డని పేర్కొని గారవించె.

క. అతఁడును దలిదండ్రులయెడ
నతిభక్తిఁ జెలంగి మూషికారూఢుం డై
సతతము నాడుచుఁ బాడుచుఁ
మతిరంజిలఁ జేసె నాయుమాశర్వులకున్.

క. అది కారణంబుగా గజ
వదనుం డై పరఁగె విఘ్నపతి మారుతభు
క్సదమలకటిసూత్త్రధరుఁడు
మదనహరునిసుతుఁడు మానిమండనులారా.

సుగంధివృత్తము. ఫాలనేత్ర సత్పవిత్ర పాండురాంగ శంకరా
నీలకంఠ వామదేవ నిర్వికల్ప ధూర్జటీ
బాలచంద్రమౌళి దుష్టభంజన స్మరాంతకా
శూలహస్త శంభు లింగ శోభనాంగ శంకరా.

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణాకటాక్షసంప్రాప్తకవితాశ్రీచి త్రాయుర్వేదవిద్యావిపినచైత్ర లోహితసగోత్రపవిత్ర నారాయణపౌత్ర సూర్యనారాయణపుత్ర పార్వతీపరమేశ్వరసేవాపారాయణ శ్రీసూర్యనారాయణకవి ప్రణీతంబైనయపనిందాపహరణం బనుప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

:0:



శ్రీ

శ్రీమత్పరదేవతాయైనమః.

# అపనిందాపహరణము

తృతీయాశ్వాసము.



క. శ్రితపారిజాత శూలక
లితకరదివ్యప్రచార లింగ పురహరా
క్రతువిధ్వంస మహేశ్వర
నతదైత్యవిపక్షరక్షణప్రియ దక్షా.

వ. అని యవ్విధంబున మునులు సూతునివలన వినాయకజన్మకథ నెఱింగి మహాత్మా గజముఖుని గణాధిపతియు నాబద్ధభుజంగకటిసూత్రుండు నని పల్కితి రది యెవ్విధంబున సంభవించె నెఱింగింపు మనవుడు.

క. మునివృషభుఁడు సాత్యవతే
యుని గురువరు మదిఁ దలంచి యుత్సాహ మెదం
దనుఁ బురికొల్ప మహేశ్వర
తనయుని విఘ్నాధిపతి గఁ దగఁ జేయుకథన్.

క. వినిపింపఁ దొడఁగె యాతీ
రున గజముఖుఁ బడసి శంకరుఁడు గౌరియుఁ దా
మెన లేనికౌతుకమ్మున
దినములు గడపంగఁ బార్వతీగర్భమునన్.

ఉ. తారకదైత్యమర్దనుఁ డుదారపరాక్రముఁ డుగ్రశత్రుసం
హారకుఁ డాశ్రితావనుఁ డపారకృపానిధి మీనకేతనా
కారుఁడు దేవసైనికనికాయవిభుం డురుసత్వవిస్ఫుర
చ్చారుమయూరవాహనుఁడు షణ్ముఖుఁ డుద్భవ మయ్యె నత్తఱిన్.

వ. ఇట్లుద్భవించి.

క. హరిహరతుల్యులు గిరిజా
పురహరనందనులు వృద్ధిఁ బొందిరి శోభా
కరులై వినిహతనక్తం
చరులై స్థిరులై యనంతసంపత్కరులై.

వ. ఇట్లాకుమారయుగంబుతో ననంతకాలం బున నుండి యొక్కనాఁడు

ఉ. సాలతమాలవంజులవిశాలరసాలతుజాలమల్లికా
జాలమతల్లికావకుళచంపకలుంగలవంగతాలత
క్కోలకురంటకక్రముకకుందకదంబకపిత్థచందన
శ్రీల నెసంగుచుం బ్రమథసేవితమై తగువెండికొండపై

మ. సురయక్షోరగసిద్ధసాధ్యఖచరుల్ జోహారు లర్పింపఁగా
గరుడుల్ సేవ యొనర్పఁ గిన్నరవరు ల్గంధర్వు లోదేవ నీ
కరుణాపాంగవిలోలదృష్టిని మముం గాపాడవే యంచు నా
హరుఁ బ్రార్థింప హిమాద్రిపుత్రి దనవామాంకంబునం దొప్పఁగా.

క. మరకతవిద్రుమమౌక్తిక
హరినీలసురత్నవజ్రహాటకరుచి వి
స్ఫురదురుసింహాసనమున
గురుకరుణామూర్తి హరుఁడు కొలు వున్నంతన్.

క. రవిసమతేజులు హైమ
చ్ఛవియుతులు ననంతసత్వసంయుతులు మహా
ర్ణవసదృశగుణోదారులు
జవమున సుతయుగము నటకుఁ జని భక్తిమెయిన్.

శా. జోహారు ల్దగఁ జేసి విశ్వమయు విశ్వోత్పత్తిను న్నాశనో
త్సాహుం బ్రస్తుతిఁ జేసి పార్శ్వముల దత్సాన్నిధ్యమం దుద్యతో
త్సాహం బొప్పఁగ నిల్చె నంతఁ బ్రమథుల్ శంభూ మహాదేవ నీ
మాహాత్మ్యంబునఁ జేసి సర్వము శుభమై యుండె లోకాళికిన్.

# తృతీయాశ్వాసము.

గీ. కాని యెల్లెడ విఘ్నముల్ గణుతికెక్కి
వెతలఁ గుందంగఁ జేయుచు వివిధగతుల
సర్వకార్యంబులను వృథా సల్పుచుండె
వానికిని వెఱవ వలసె నో వామదేవ.

క. కావున వానికిఁ బతిగాఁ
గావింపఁగ వలయు నొకని ఘనవిక్రమునిన్
దేవ యటుగాక తక్కిన
భూవలయమునందు శుభమువో దుర్లభ మై.

గీ. అని వచించిన పుత్రులం గని యుమేశుఁ
డిది వహింపఁగ మీలోన నెవ్వ రగుదు
రనిన షణ్ముఖుఁ డిది యేను గొని రయంబు
జగము రంజిల్లఁ జేతు నో సఁగుము తండ్రి.

మ. అనినన్ లేచి గజాస్యుఁ డిట్లనియె నన్యాయంబుగా కగ్రనం
దనుఁడుం గల్గఁగఁ జిన్నవాని కిడుటల్ ధర్మంబె యన్నన్ షడా
ననుఁ డీతం డబలుండు తుందిలుఁడు పూనం జాలఁ డీభారముం
గనుమా యిద్దఱతారతమ్యముల శ్రీకంఠా జగద్రక్షకా.

క. తారకదైత్యుని లసదసి
ధారాహతగళునిఁ గాఁగఁ దగఁ జేసి మహా
ధీరతఁ గ్రౌంచాద్రిని దో
స్సారమునఁ బెకల్చి విబుధసంస్తుతిఁ గంటిన్.

గీ. కాన నను దీని కర్హునిఁ గాఁ దలంపు
మనుచు శరజన్ముఁ డది గూడ దని గజాస్యుఁ
డిత్తెఱంగునఁ గోర్కెల నొత్తి పలుక
పురహరుఁడు వారి కనియె నో పుత్రులార.

క. వాదంబు లేల మీ కిటు
మేదినిఁగలపుణ్యనదుల మీ యిర్వురలో
నేదియు విడువక క్రుంకిడి
నాదరికిం దొలుత వచ్చునతని కొసఁగుదున్.

క. ఏగుఁ డనఁ జనియె మారుత
వేగమున మయూరతురగవిఖ్యాతుం డా
లో గజవదనుఁడు తనకటు
పోఁగ నశక్యం బటంచుఁ బొక్కుచు నాత్మన్.

గీ. తల్లికడ కేగి కడచిన దెల్లఁ దెల్పి
కడువిచారింపఁ దనయుని గారవించి
వగవ వల దని తెల్పి యానగతనూజ
తనయునకుఁ జెప్పె నొకదివ్యతత్త్వ మపుడు.

వ. ఆ శ్లేటింగించి యియ్యది నారాయణమంత్రంబు దీని ప్రభావం బనంతం బగ
ణ్యంబు.

క. ఒకమా ఱిది జపియించిన
సకలాఘౌఘంబు లడఁగు సత్వరగతి వే
ఱొకమా ఱిదఁ దలఁచినవాఁ
డకలంకత నొందుఁ దీర్థయాత్రాఫలమున్.

క. పలుమాఱు పునశ్చర్యను
సలిపినఁ బురుహూతపదవి సమకూరెడుని
చ్చలు భక్తిని జపియించిన
సలలితవైకుంఠపదవి సాధింప నగున్.

గీ. గాన నీదివ్యమంత్రముఁ బూని విమల
మతి జపించితి వేని పల్మాఱు పుణ్య
తీర్థములఁ గ్రుంకుఫలము సిద్ధించు సువ్వె
యన్న కరిముఖుఁ డది గొని యతిరయమున.

గీ. హరునిదరిఁ జేరి ప్రణమిల్లి యాపురారి
చెంత నొకయెడ మనము రంజిల్ల సత్స
మాధిగతుఁ డయ్యె శ్రీరమానాథువిమల
మంత్ర మెదఁ బూని యగజాకుమారుఁ డంత.

సీ. అటు మహాజవమున నాకార్తికేయుండు గంగానదిం జేరఁగాఁ జనునెడ
నాతీర్థమున స్నాన మాచరించి గజాస్యుఁ డెదు రైన షణ్ముఖుం డెదఁ గలంగి
యదివాసి గౌతమీనది డాసి యట మూషికారూఢుఁ గని విస్మయంబు నొంది
పటురయంబునఁ దామ్రపర్ణీనదిం గాంచి యయ్యెడ గజముఖుం దల్లెదురఁగఁ

గీ. గనఁగవచ్చినఁ బటుతూర్ణకలితుఁ డగుచు
యమున కరిగిన నందు గజాననుండు
దోఁచె నట లేచి కావేరిఁ జూచి యచట
కదలి పృథ్వీగతం బైననదుల నెల్ల.

మ. మునుగం బోయి గజాననుండు దనకున్ ము న్నున్నఁ గాన్పింపఁగా
జనితక్రోధమనస్కుఁ డై యురగభుక్సంచత్తురంగంబునుం
గని రౌద్రాకృతి నందుచుం దఱుముచున్ ఘూర్ణంబు పెన్వెల్లి యై
గనుపట్టన్ శరజన్ముఁ డేగ నురుకాంక్షన్ శర్వు దర్శింపఁగాన్.

క. అటుల న్శరజన్ముఁడు దాఁ
బటుగతి నరుదెంచి హరునిపజ్జను శోభా
పటలి దిగంతము లాలయఁగఁ
జటులత వసియించు నగ్రజన్మునిఁ గాంచెన్.

వ. ఇట్లు కాంచి సర్వేశ్వరుం డగుశర్వునకు నమస్కరించి.

క. ఏ వీనిం దుందిలుఁ గా
భావించితి నితఁడు నీదు భక్తుం డగుటన్
దేవ యిది యెండుగా దీ
భూవలయము నెల్లఁ దాల్చు భుజసారమునన్.

క. ఈతనిసత్త్వ మెఱుంగక
నీతివిహీనత మహాత్మ నిరసించితి వి
ఖ్యాతపరాక్రము నగ్రజు
నీతప్పును సైచి నన్ను నేలుము తండ్రీ.

వ. అని ప్రార్థించి మహానుభావుం డైనయన్నం జూచి.

క. రాజితకీర్తి మహేశ్వర
భూజననుతుఁ డగ్రజుండె పూజ్యుం డగు దా
నే జగతిఁ గల్గు పుణ్యన
దీజలములఁ గ్రుంకి యేగుదెంచెం దొంతన్.

క. అని వేడుక బల్కిననం
దనుపల్కుల కలరి గజవదను నధిపునిఁగా
నొనరిచి ప్రమథాములఁ గ
న్గొని మీకును విభుఁ డితండె కొల్వుఁడు వీనిన్.

వ. అని యానతిచ్చిన విని సర్వనిలింపులును మహోత్సాహులై నాఁటిదివసంబున విఘ్నేశ్వరునిం బలువిధంబుల నలంకరించి ధూపదీపంబు లొసంగి మహోపహారంబు లర్పించి సేవించి రంతఁ గొంతకాలంబున కమ్మహేశ్వరుండు సర్వదేవసేనాధిపత్యం బొసంగి షణ్ముఖునిం బుత్తెంచె.

గీ. భాద్రపదమాసమున శుక్లపక్షయుతచ
తుర్థదివసంబునను విఘ్నపార్థివునిఁగ
జేసె గజముఖు నది మొదల్చేసి వాని
నద్దినంబున సేవింతు రఖిలజనులు.

క. ఆవిధి గావించి మహా
దేవుం డగజాతఁగూడి దివిజులు సతమున్
సేవింప విఘ్నపతితో
నావరభూధరనివాసుఁ డై యుండంగన్.

గీ. ప్రథితదిన మైనయాభాద్రపదచతుర్థి
రాఁగ జను లెల్ల నావిఘ్నరాజుఁ గొలువఁ
బుష్పగంధాక్షతలు వస్త్రభూషణములు
ధూపదీపంబులును ఘృతదుగ్ధములును.

గీ. ముద్దకుడుములు నుండ్రాళ్లు మొదలు గల్గు
భక్ష్యములు తేనె ఫలములు నిక్షుశకల
ములును సమకూర్చి యత్యంతమోదకలితు
లగుచు గజముఖురాక కై యరయుచున్న.

క. శంకరుఁ డాలో గజముఖు
వంక నిరీక్షించి లోకవాసులు ఖచరు
ల్పంకజభవముఖ్యులు దృ
క్పంకజములు దెఱచి విపులభావముల నినున్.

గీ. పూజఁ గావింప మదిఁ గోర్కెఁ బొడమి నీదు
రాకఁ గోరుచు నుండిరి రయముమీఱ
నచటి కరుగుము పుత్రక యనుచుఁ దెలుప
హరునకును మ్రొక్కి యాఖువాహనము నెక్కి.

క. కదలి యట కేగి భక్తులఁ గాంచి వార
లొసఁగు కుడుములు నుండ్రాళ్లు వెసను గొన్ని
వాహనంబున కొసఁగుచు వలసి నన్ని
దినుచు నింటింట నీరీతిఁ దిరిగి తిరిగి.

గీ. బొజ్జ నిండించి చేతులఁ బూని కొన్ని
తొండమునఁ గొన్ని చేర్చి యాదండివేల్పు
కొక్కుపై నెక్కి కైలాసకుధరమునకుఁ
జేరునెడ సూర్యుఁ డపరాబ్ధిఁ జేరె నంత.

సీ. అటు భానుఁ డస్తాద్రి కరుగఁ బతంగముల్ కిలకిలధ్వనుల నిమ్ములను జేరె
కమనీయపద్మముల్ గలవిలాసము మాని ముకుళత్వమును జూప మొదలువెట్టె
లలి చక్రవాకముల్ బలవించుచును బోయెఁ గవవిడి వేర్వేఱు గతుల నంత
తనయునిరాక నెందునఁ గనంబడ కున్న శర్వాణి మిగుల విచార మంది

గీ. దిశలు పరికింప నంత నేతెంచి సుతుఁడు
వాహనము డిగ్గి పార్వతీవామదేవు
లకుఁ బ్రణామము సేయుకౌతుకముతోడ
వారికిఁ బ్రదక్షిణంబు ముమ్మాఱు సేసి

క. కోరిక సాష్టాంగముగా
ధారుణిఁ బడి మ్రొక్కుతఱిని తత్కుక్షి ధరన్
జేరి కరాబ్జము లూర్ధ్వం
బై రహిఁ జెన్నారె శీర్షమటు పై కెగసెన్.

గీ. అత్తెఱంగున సెగయంగ నతఁడు గడుఁ బ్ర
యాసమునఁ జేతులను భువి నానఁ జేసి
శిరము గదియింప పాదము ల్చేరె దివికి
వాని దిగునంగఁ గరములు వాసె భువిని.

క. అవ్విధమున గజవదనుం
డవ్వసుమతిఁ బొరలు చున్న నంబుజరిపుఁ డా
దవ్వులఁ గన్గొని ఫక్కున
నవ్వెన్ శంకరునిశిరమునందుఁ జెలఁగుచున్.

క. అది కని గౌరీమణి దా
నిది యేమగునో నృపాలుఁ డీక్షించె మహా
పద వాటిల్లక యిట మా
న దటంచు విచార మాననమునం దోఁపన్.

గీ. తనయు నీక్షింప నంతలోఁ దజ్జఠరము
వ్రక్కలై మోదకంబు లుండ్రాళ్లు వెలికి
వచ్చి బొరలఁగ భూస్థలిఁ జచ్చి యున్న
నందనునిఁ గాంచి విలపించి నగతనూజ

గీ. ఓరి పాపాత్మ! నిన్గన్నవారి కెల్ల
నవని వాటిల్లు చుండు నీలాపనింద
లనుచు శాపం బొసంగె నాయజ్ఞవైరి
కపుడు రౌద్రంబు ముఖమున నావహిల్ల.

వ. ఇట్లు ఘోరశాపం బొసంగి హరపురస్సరంబుగా నందనునిఁ జేరం జని కడు
విలాపించు చున్నంత.

క. గడగడవడఁకుచుఁ బెదవులు
దడపుచు నపరాధి ననుచు దండము లిడుచున్
వడివడిఁ బ్రార్థించెడు నా
యుడుపతియార్తిఁ గని కరుణ యుప్పతిలంగన్.

క. పంకజగర్భుఁడు దివిజులు
పంకజనాభుండు దివిజపతి ఖేచరులుం
బంకజవైరిని బ్రోవఁగ
శంకరసుతు మనుప వేగ జని రయ్యెడకున్.

గీ. ఇట్లు సనుదెంచి బ్రహ్మాను లతని నెత్తి
పొట్ట సవరించి యుండ్రము లెప్పటి కట్టి
దట్టముగఁ బుట్టబెట్టుల గట్టి హారుని
పట్టి బ్రతికించి యాగిరిపట్టి కొసఁగి.

క. ఈతం డపమృత్యుం డై
భూతలమున జనులు తొలుతఁ బూజింపఁగ వి
ఖ్యాతయశుఁ డగుచు వర్ధిలు
నోతరుణి! భవాని వరము లొసఁగితి మటులన్.

మ. జననీ పద్మభవాండముల్ విమలదృక్స్వరప్రసారంబులం
గని రక్షించుమహాత్మురాల విటు లల్గం జెల్లునే నిర్దయన్
ఘనదోషాకరుఁ గా శపించితివి నిష్కాపట్యుఁ డౌ చంద్రునిన్
మను లెట్లాతనిఁ గాంచ కిష్మహిజనుల్ మాన్యుం డతం డీశ్వరీ.

క. కావున శాపవిమోక్షణ
గావింపు మటంచు సురలు కడువేఁడ మహా
దేవునిరాణి మనంబున
నావిర్భవ మైనకరుణ నపు డిట్లనియెన్.

క. శాపము వ్యర్థం బై పో
నోపదు ప్రత్యహముఁ గాంచ నొందదు జనులం
బాపం బపవాదము నీ
పాపనివృతిదినమునందు బాధించు వెసన్.

మ. అని యాగౌరి వచింప సర్వసుర లాహ్లాదప్రపూర్ణాత్ములై
వినువీధిం జని రాసుధాకరు హరు న్విఘ్నేశ్వరు న్వీడుకొ
ల్పి నిజావాసములం జెలంగ విలసత్ప్రేమావిశేషంబునం
దనయుం గూడి సుఖోన్నతిం దనరి రంతం బార్వతీశర్వులున్.

గీ. నాఁడు మొదలుఁగ శర్వరీనాథుఁ భాద్ర
పదసితచతుర్థిఁ గనఁగ నొప్పరు జనంబు
నింద్యమై దగునీలాపనింద లొందవు
ననుభయంబునఁజేసి మహాత్ములార. [ రాంగా

లయగ్రాహి. చందనశరత్కుసుమకుందనవసూనశరదిందుమకరందవరబిందురుచి
యిందుధరమౌనివరవందితసుపాద సురబృందనుతభక్తజననందితగుణాఢ్యా
సుందరలసద్గళ యమందఫణిహార గిరినందనముఖాబ్జమకరందరసపానేం
దిందిర దయాబ్ధి యరవిందసమపాద కురువిందసమనేత్ర సుపురందరసుగీతా.

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణాకటాక్షసంప్రాప్తకవితావిచిత్రాయు
ర్వేదవిద్యావిపినచైత్ర లోహితసగోత్రపవిత్ర నారాయణపౌత్ర సూర్యనారా
యణపుత్ర శ్రీపార్వతీపరమేశ్వరసేవాపారాయణ సూర్యనారాయణకవిప్రణీ
తంబైనయపనిందాపహరణంబను ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.





శ్రీ

శ్రీమత్పరదేవతాయైనమః.

# అపనిందాపహరణము

## చతుర్థాశ్వాసము.





శ్రీకంఠ శివ మహేశ కృ
పాకరవర త్రిపురహర శుభాకర గుణర
త్నాకర హర గురుభక్తస
శీకర ఫణిహార చంద్రశేఖర సాంబా.

అవధరింపు మట్లు శౌనకాదులు గణాధిపత్యకథనంబును చంద్రవీక్షణంబును గజముఖపంచత్వంబును పార్వతీశాపంబును సురాగమనంబును భుజగబంధనంబును పునఃప్రాణసంధానంబును శాపవిమోచనంబును విని మహానందకందళిత హృదయారవిందులై సూతుం గని.

మునినాథ యాసుధాకరుఁ
గనుఁగొని నీలాపనిందఁ గాంచి వెతలఁ గుం
దినవారు కలరె ధాత్రిని
వినిపింపుము వినఁగ మాకు వేడుక యయ్యెన్.

అని వినయంబునం బలుకునంత మునిప్రవరుండు సూతుఁ డి
ట్లనియె మహాత్ములార కమలారిని శాపము నొందుపిమ్మటం
గని యపవాద తప్తైనయఁగా విపులార్తిఁ గృశించినట్టియం
గనలచరిత్రఁ దెల్పుదుఁ బ్రకాశముగాఁ దగ నాలకింపరే.

క. ఒకతఱి సప్తమహర్షులు
ప్రకటితసత్క్రతువొనర్చి భార్యలతోఁ బా
వకునకును బ్రదక్షిణపూ
ర్వకముగ నతిఁ జేయుతఱిని వారలఁ గనుచున్.

క. పావకుఁ డామునికాంతల
లావణ్యముఁ దలఁచి విరహలంపటుఁ డగుచున్
జీవచ్ఛవమై శుష్కీ
భావమునం దోఁప నతనిపడతి దిగులునన్.

క. నాథా నీవెన్నఁగ జగ
దాధారుఁడ వచ్యుతుండ వజరుండ వప
క్రోధుండ వంతరాత్మవు
సాధుజనానందమోక్షసంధాతవు గా.

గీ. అట్టి మహనీయునకు వ్యాధి పుట్టుటరయఁ
గడు విచిత్రంబు వేఱొకకారణంబు
కల్గిన వచింపు మది యెట్టికష్టమైనఁ
బూని యొనఁగూర్తు నిప్పుడ పోయి నాథ.

గీ. అని వచించిన భార్యఁ గన్గొని కృశానుఁ
డమితలజ్జాభరం బాననమునఁ దోఁప
నపుడు దా నిట్టు లని పల్కె నమ్మహర్షి
సప్తకము సవనంబును సల్పుతఱిని.

క. పలుమాఱు ప్రదక్షిణములు
సలిపిరి తత్సతులు తమకు సాన్నిధ్యములన్
విలసిల్ల నాకు నాఁ డా
లలితాంగులయందు మనము లగ్నం బయ్యెన్.

సీ. ఆదికారణంబుగా నావిర్భవం బయ్యెనీమనోరుజ వాయు టెట్లు తరుణి
పుణ్యాంగనలు వారిఁ బొందఁ దెవ్విధిఁ గల్గు మన మెఱింగించిన మను టదెట్టు
లదిగాక నాకాంత లనుకూలవతు లైన శపియింతు రమ్మునీశ్వరులు కన్న
జాతవేదుండ నై జన్మించి జారత్వమునఁ జరించిన పాపి యనరె నన్ను

గీ. గాన నెట్లైన మరణంబు గల్గు నిజము
తీర్పరా దిది నీకు సతీలలామ
యని విచారింప నంత స్వాహావధూటి
మగనిఁ గని పల్కె దీని కై వగవ నేల.

క. ఏ నొనగూర్తు విచారము
మానుము ప్రాణేశ లేశమాత్రం బైనన్
రానీను కీడు రే పా
మానినులను గూర్తు నమ్ముమా నిజ మిదిగాన్.

క. అని చింతవాపి తా నా
మునిపత్నులసత్స్వరూపములు దాల్చుచు నా
ఘనునిఁ గలయుచు నాతని చిం
తను వాపె మహాపతివ్రతారత్న మొగిన్.

క. ఈవిధి నాథునిఁ దన్పుచుఁ
బోవుచు రా జనులు దానిఁ బొడఁగని జారల్
దేవర్షి సతు లటంచును
భూవలయమున న్వచింపఁ బూనిరి గుములై.

సీ. వసుధ నీవిధి నపవాద మెందైయున్న మునిసప్తకంబు మానినుల విడిచి
చరియించు చున్న నాతరుణులు భీత లై యనపరాధల మేలుఁ డనుచు నెంత
వేఁడిన మానులు విన కున్న నది యేల నొదవెనో యని చింత నొంది గడుఁ గృ
శించి వాణీవిభుఁ గాంచి నమస్కృతుల్ కావించి యోహేమగర్భ మమ్ము

గీ. నిరపరాధల నీయపనింద మోపి
పతులు విడిచిరి మే మింక బ్రతుక నొల్ల
మనుచు శోకింప విస్మయ మంది యతఁడు
వగవ వల దని యూరార్చి వారలఁ గని.

క. ఓతరుణీమణులారా
లాతిసతులు మీకు సాటి రాఁ గలరె భువిం
బాతివ్రత్యమునందున
మీత ప్పొకయింత లేదు మీ రోడకుఁడీ.

క. ఇది మీ రాచంద్రుని శా
పదినమునం గాంచి రంమవలనఁ గలిగె ని
య్యది వాయఁగల దటంచును
సదయత నెచియించి యజుఁడు సప్తర్షులకున్

క. తెలిపె నిటు లగ్ని దేవునిఁ
గలసె భవత్సతులరూపు గైకొని స్వాహా
తిలక మటుగానఁ గొని మీ
నిలయంబుల కరుగుఁ డో మునీశ్వరులారా.

క. వీరలసుచరిత్రంబుల
సారమతిం దలఁచునట్టి సాధ్వీమణులం
జేరఁగ వెఱచు నఘంబు లు
దారయశస్సుఖము లబ్బుఁ దథ్యముగ భువిన్.

వ. అని యాపరమేష్ఠి యిది శాపగతచంద్రవీక్షణంబునం గలిగిన యపవాదంబు కాని వీరలదోసంబు గా దని సందియంబు వాయం బలికి యాపుణ్యసతుల వారల కొప్పగించి నిజనివాసంబులకుం బనిచె.

తోదకవృత్తము. పరమకృపాకర భక్తవిధేయా
సురుచిరసుగుణసుశోభితకాయా
కరిచర్మాంబర గౌరీరమణా
చిరతరమౌనిసుసేవితచరణా.

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణాకటాక్షసంప్రాప్తకవితావిచిత్రాయుర్వేదవిద్యావిపినచైత్ర లోహితసగోత్రపవిత్ర నారాయణపౌత్ర సూర్యనారాయణపుత్ర శ్రీపార్వతీపరమేశ్వరసేవాపారాయణ సూర్యనారాయణకవిప్రణీతం బైనయపనిందాపహరణం బనుప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.





శ్రీ

శ్రీమత్పరదేవతాయైనమః.

# అపనిందాపహరణము

## పంచమాశ్వాసము.



క. సురవరసేవిత గురుపద
సరసీరుహ ఫాలనేత్ర శంకర విశ్వే
శ్వర పార్వతీమనోహర
దురితహరణ హర విపక్షదోర్బలహరణా.

వ. అని సూతుఁ డెఱింగించిన విని శౌనకాదు లిట్లనిరి.

ఉ. మౌనివరేణ్య సర్వజనమాన్య యగణ్యసుపుణ్య ధీనిధీ
యానళినారిఁ గాంచి భువియం దిటుల న్మతి యెవ్వరేనిఁ దా
దినత బొందిరే యెఱుఁగఁదెల్పు మ టన్న సమస్తశాస్త్రవి
ద్యానిపుణుండు సూతుఁ డపు డామునిబృందముఁ జూచి యిట్లనెన్.

క. పరమాత్ముఁడుగృష్ణుం డీ
కరణిని నీలాపనిందఁ గాంచి మహాను
స్థిరధైర్యశౌర్యమహిమల
నిరసించి ప్రశస్తిఁ గాంచె నిర్మలుఁ డగుచున్.

వ. అని పలికిన మునులు మహాత్మా యీపుణ్యచరితంబుఁ దెలుపవే యనవుడు సూతుం డిట్లని వచింపం దొడంగె.

సీ. వసుధలో దానవుల్ వసుధేశులై యుద్భవించి సత్కర్మ లడంచి దురిత
వర్తను లై మించి వసుధకు భారంబుఁ గల్పింప వంతచేఁ గడుఁ గృశించి
విశ్వంభరాదేవి విశ్వాత్ము నాహరిఁ గాంచి యిట్లని పల్కెఁ గంజనాభ
దుర్మదాంధులు లోకదూషకుల్ దుష్టవర్తనులు మెం డైరి నే దాల్ప నోప

గీ. ననుచు శోకింప వారింతు నరుగు మనుచుఁ
దెల్పి హరి దేవకీవసుదేవులకును
గృష్ణుఁడై పుట్టి దుష్టుల గీ టడంచి
వసుధఁ బాలింపు చుండ నొక్కసమయమున

ఉ. చారుసితాబ్జకుందనవశారదనీరదతారహీరనీ
హారమరాళిరాజరజితాచలహాససమప్రభాంగుఁ డా
నారదమౌని దివ్యమునినాథుని గృష్ణు గనంగ నయ్యెడన్
ద్వారక కేగుదెంచె బుధవర్గము తన్నుతియించు చుండఁగన్.

గీ. ఇవ్విధమ్మునఁ జనుదెంచు నవ్విబుధము
నీశ్వరునిఁ గాంచి యంత సర్వేశ్వరుండు
పుండరీకాక్షుఁ డెదు రేగి పుణ్యమూర్తి
కెఱగి కొనితెచ్చి పూజ గావించి యపుడు

గీ. దేవ మీ రిచ్చటికి నరుదెంచు టరయఁ
నస్మదీయనివాసమం దఖిలములును
నేము భృత్యులు సుతులు సతీమణులును
బావనతఁ గాంచితిమి నేఁడు భాగ్యవశత.

వ. అని భక్తిపూర్వకంబుగాఁ బలుకు చున్న శౌరిం గని నారదుం డిట్లనియె.

గీ. ఆదిదేవుం డనంగ బ్రహ్మాదిసురల
కరుణచేఁ బ్రోచుతండ్రివి గావె నీవు
కేశవ ముకుంద శ్రీహరి కృష్ణ వాసు
దేవ నారాయణాఖ్యలఁ దేజరిల్లి.

మ. భువి నీయందున పుట్టు వర్ధిలుఁ దుదినొప్పు నాశమై మాధవా
దివిజానీకము త్వత్కటాక్షమునఁ గాదే మోదనిర్మగ్నులై
భవబంధంబులు వాసి నిర్జరతచే వర్ధిల్లుటల్ పుట్టి తీ
వవనీభార మణంప దుష్టరిపుసంహారంబుఁ గావింపఁగన్.

గీ. అట్టి నీమూర్తి దర్శింప నమరు లెపుడు
కోరు చుందురు నిన్ను గన్గొనుట నాదు
జన్మ సఫలత నొందె నోశరదగాత్ర
త్రిపురహారమిత్ర సితపుండరీకనేత్ర.

గీ. నెల వొసంగుము పోవలె శీతకరుఁడు
గన్పడకమున్నె దేవలోకమున కన్నఁ
గృష్ణుఁ డది విని చంద్రు నీక్షింపఁ గూడ
దంటి వది యేల తెల్పు మోయత్రినేత్ర.

క. తెలుపు మన గౌరి నేఁడా
జలజారిని గాంచినట్టిజనములు కడునిం
దల పాలగుదు రటంచును
బలికె సుతునిమ్మృతికి మిగుల వగచి మురారీ.

క. అని ముని సర్వముఁ దెలుపుచు
జనినం గృష్ణుండు నేఁడు శశిని గనఁగరా
దని పురి సాటఁగఁ బంచిన
జనములు విభునాజ్ఞ సనిరి సదనంబులకున్.

గీ. ఇట్టు లపవాదభీతిచే నెల్లప్రజలు
సూర్యుఁ డస్తాద్రి కరుగుటఁ జూచి యంత
సదనములనుండి వెలికి రా నోదిగి యున్న
తతిని శిశువులు పాల కై తల్లడిల్ల.

గీ. కాంచి కృష్ణుఁడు లేఁగలఁ గలయఁ బంచి
శిరము దగ వంచి గోవులు చేపఁ గాంచి
ఘటము సవరించి పదములు గదియ నొంచి
పొంచి పాల్మించి పితికి చాలించి యంత.

గీ. ఘటము చేఁబూని యటురాఁగఁ గమలవైరి
శాపలజ్జాభరంబున సద్మమునను
డాఁగెనో యన దుగ్ధఘటంబునందుఁ
దోఁచె శౌరికి మది దిగుల్దోఁప నపుడు.

సీ. అటు గాంచి మాధవుం డారేయి గడపి తా మఱునాఁడు పౌరులు మంత్రిజనులు
హితులుఁ బౌరోహితుల్ సుతులు భృత్యులుఁ దన్ను సేవింపఁగా గొల్వుచేసి రేయి
దుగ్ధంబులను శశి తోఁచుట నెఱిఁగించి యపవాదభీతి తన్నావహింప
భాసురం బైనసింహాసనంబున సంశయాత్ముఁ డై యున్న దైత్యారిఁ గాంచఁ

గీ. గంఠమున నతఁడు శమంతకమణితోడ
నిజతనుద్యుతి దిక్కులు నిండి వెలుఁగ
ధరణిఁగతుఁ డైనభానునికరణిఁ దోఁప
రహిని సత్రాజితనునొక్క రాజవరుఁడు.

క. చనుదెంచినఁ గృష్ణుండా
జనపాలునిఁ దెచ్చి యొక్క సముచితపీఠం
బున నసియింపఁ గఁ జేసి య
తనికుశలముఁ దెలిసియున్నతఱి నిట్లనియెన్.

మ. జననాథాగ్రణి యుష్మదీయగళభాస్వద్రత్న మాదిత్యశో
భను జెన్నారెడు తత్ప్రభావము నుతింపం జాల మిద్ధాత్రిపై
విని యుం గాంచి యెఱుంగ మిట్టిమణు లెవ్వీటం ద్రిలోకంబులన్
గనరా వెవ్వ రొసంగి రేమికతనన్ గల్గెన్ వచింపంగదే.

సీ. అని చక్రపాణి వల్కినయంత భూపాలవరుఁడు సత్రాజిత్తు వల్కె నిట్లు
చిరకాల మాదిత్యు సేవింప నాదేవుఁ డలరి ప్రత్యక్షమై నిలచి నన్ను
గని కోర్కె నీ కెద్దిగల దన్న నాతని సతముఁ బూజింపఁ గోరితి కృపాళుఁ
డెద మెచ్చికొని నచ్చి యిది మత్సమానంబుగా వున నర్చింపఁ గడఁగుదేని

గీ. దినము హాటక మిడు కోర్కెదీర శత్రు
జయము సమకూర్చు కోర్కెల సరగ నిచ్చు
నాయురారోగ్యపుత్రపౌత్రార్థచయ మొ
సంగు నని తెల్పి యొసఁగె నాజలజవిభుఁడు.

గీ. అది మొదల్దీని నర్కునిఁగాఁ దలంచి
మించి సద్భక్తి నర్చించి మెడ ధరించి
సమరములఁ జొచ్చి శత్రులసంహరించి
జయము గైకొందు ధనధాన్యచయము గందు.

క. అని పలికినసత్రాజితుఁ
గనుగొని కృష్ణుండు దీనిఁ గాంచినది మొదల్
మనమునఁ గోర్కె జనించెడు
జననాయక దీని నొసఁగఁజనదే మాకున్.

వ. అని సాభిలాషంబుగాఁ బలికిన.

సీ. దీనిలాఁతుల కీఁయఁగా నోప నని తెల్పి నీరజాక్షునిఁ బాసి నిజపురంబు
సేరి కృష్ణునిఁ జూడఁ గోరిక యేటికి జనియించె నాఁ గాక చండకిరణుఁ
డొసఁగినమణి యేల నొగిఁ దాల్చి పోవలెఁ బోయితిఁ గాకేమి భూరితేజ
మగుదీనిఁ గాంచి యి మ్మణి మాధవుం డేల కోరఁగా వలె నియ్యకొనక యిట్టు

గీ. లేటి కరుదెంచినాఁడ నన్నిఁటినిఁ జూడ
వాసుదేవునితో బలవద్విరోధ
మయ్యె నింకుల కేమిసేయంగఁ దోఁచ
దనుచు నీరీతి తలపోసి యార్తి నొందె.

గీ. మంత్రిజనముల కెఱిఁగించి మది విచార
మగ్న మై యుండ నీరీతి మనుజవిభుఁడు
దినములను బుచ్చుతరి వాని యనుజుఁ డగుప్ర
సేనుఁ డమ్మణిఁ గొని నిజసేనతోడ.

సీ. వేటాడ మదిఁ గోరి విపినంబునకుఁ జేరి శరభశార్దూలభీకరవరాహ
భల్లూకహరికలభసమూహములు ఘోరగవయభిల్లీకురంగవిషభుజగ
ఖడ్గసాలావృకగండభేరుండమార్జాలమర్కటశల్యచమరమహిష
సముదయంబుల డాసి చంపుచు భీతిచేఁ బరువెత్తువాని వెంబడిని జనుచు

గీ. మురుశరంబుల రుధిరంబు ధరణిఁ దొరఁగ
నేయుచును బట్టుచును వేడ్క నివ్విధమున
నిజమణిద్యుతి దిక్కులు నిండి వెలుఁగఁ
దురగగతుఁ డోచు నిట్టుల నురుపడించె.

వ. ఇవ్విధంబున నిజసైన్యంబులం బాసి ప్రచండకాండంబుల సకలమృగసంహా
రంబు గావింపుచు నొక్కకురంగంబు వెంటం దురంగవరంబుం బఱపి గిరిగుహా
ముఖప్రాంతంబులకుం జని

గీ. భానుకరణిని మెఱయంగ వాని నొక్క
భయదకంఠీరవము డాసి పట్టి యురముఁ
ద్రొక్కి జఠరంబు నఖముల వ్రక్కలించి
పిసితమును మెక్కి మణిగొని భీమగతిని.

క. పోయెడుహరిఁ గని భల్లుక
నాయకుఁ డటు దాకి భల్లనఖముల దానిన్
మాయించి యామణిం గొని
కో యని యార్చుచును దనగుహకుం బోయెన్.

చ. అటు జని జాంబవంతుఁడు మహాప్రతిభన్ రవితుల్యమై సవి
స్ఫుటచటులాంశుజాలముల భూవలయంబు వెలుంగఁజేయు నా
పటుతరదివ్యరత్నము శుభస్థితి జాంబవతీసుతాసము
త్కటపరిఖేలనావిషయకందుకమై వెలయంగఁ జేసినన్.

గీ. అమ్మహామణిఁ గొని నిత్య మాశుభాంగి
సఖులతోఁ గూడి క్రీడలు సలుపుచుండి
సంతసంబున నుండె నజ్జనకునకును
మనము రంజిల్లె నాసఖీమణిఁ గనంగ.

క. అంతఁ బ్రసేనుఁడు దమసాం
కేతమునకు రాక యున్న గిరిగహ్వరము
త్కాంతార మరసి యాభూ
కాంతునియనుజన్ముఁ గాంచగా లేక భటుల్.

క. వగపునఁ జని సత్రాజి
జ్జగతీవరుఁ గాంచి నతులు సల్పి మహోగ్రుం
డగుచుఁ బ్రసేనుం డడవిని
మృగములగీ టడచి యడచి మృగి నొకదానిన్.

క. కని యురుపడించి తురగము
వెనువెంటం బరపి మమ్ము విడిచి యొకేనిం
జని మరల మమ్ము గూడఁడు
జనవర కనుఁగొంటి మెల్లశైలాంతరముల్.

క. అని దీనవదనులై ప
ల్కినభటవర్గములఁ గాంచి కృష్ణుఁడు మణికై
దునిమె ననుజన్ముఁ గావు
న్నను మును జని రాఁడె జయమునన్ మృగములతోన్.

క. కావున నీవుపకృత్యముఁ
గావించినయతఁడు శౌరి గరుడధ్వజుఁ డా
గోవిందుఁడు కంసాంతకుఁ
డావసుదేవాత్మజుండె యగు తథ్యముగాన్.
గీ. మున్ను తనుజూడ నే పోయి యున్నతరిని
మణిని గన్గొని యాస నిమ్మని వచించె
ప్రతిదినమ్మును హేమంబు పదియు రెండు
బారువ లొసంగు ననులోభభరముచేత.
క. ఈఁ జాల కున్న నేఁ డటు
బోఁ జూచి ప్రసేను నడవిఁ బొలియించి మహా
తేజమున వెలుఁగుమణిఁ గొని
దాఁ జనియెన్ సందియంబు తగ దిందులకున్.
వ. అని విస్పష్టంబుగాఁ బలుకుట నాప్తజనంబులవలనం గృష్ణు డెఱింగి.
చ. సునము కలంగి దుష్టరిపుమర్దనుల న్వినుతప్రభావులన్
సునిశితదివ్యసాయకవిశోభితహస్తుల రామసాత్యకీ
ఘనులను గాంచి తెల్పి శశిఁ గాంచితి దుగ్ధములందు నింద్య మా
దినమునఁ దత్ఫలం బరుగుదెంచె నికెట్టుల వాయఁ జేతునో.
క. అని వగచి మంత్రి నుద్ధవుఁ
గని సేనలఁ గూర్పు మేను గహనంబులకుం
జని సత్రాజిత్తునిత
మ్మునిఁ జూడ నెఱింగి తెత్తు మోదమున మణిన్.
గీ. అట్లు లొనరింప కున్న లోకాపవాద
భరము వాయదు జనులు న న్బాపి యనుచు
గనఁగ నొల్లరు రాజసంఘములలోన
ఘనత సెడుఁ గేలిసల్పఁగఁ గాంతు రకట.
క. అనినం జతురంగంబుల
ననుకూలముఁ జేసి మంత్రి యాదవవిభునిం
గని మ్రొక్కి సైన్య మిటకుం
జనుదెంచె నరణ్యములకుఁ జనవచ్చు విభూ.

వ. అని విన్నవించిన.

మ. చతురంగంబులఁ గూడి కృష్ణుఁడు మహోత్సాహంబు సంధిల్ల నా
క్షితిపాలానుజుఁ డేగినట్టి తెర వా సేనల్ వెస న్దెల్ప గా
ఢతరారణ్యముఁ జొచ్చి చొచ్చి యొకచోట న్మానవాశ్వాస్థిసం
తతిఁ గాన్పింపఁ బ్రసేనుఁ డీల్గె నిట తథ్యం బంచు వాక్రుచ్చుచున్.

సీ. దరిఁ జేరి పరికించి తత్సమీపంబున హర్యక్షపదచిహ్న లగపడుటయు
హరి వీని బొలియించె నని నిశ్చయించి యాగురుతున కొంతద వ్వరిగి యరిగి
యొక్కచో మృతినొంది యున్న కేసరిఁ గాంచి యాపరంగటను భల్లూకచరణ
లక్షణంబు లటుండ నీక్షించి దీనిమృతికి హేతు విది యని తెలిసి దాని

గీ. జూడ నరుదెంచి యట నొక్క శైలబిలముఁ
గాంచి భల్లుక మిట నుండఁ గల దటంచు
సేనల నటుండ నియమించి శిరము వంచి
గుహకు నరుదెంచి నిర్భీతి గురుభుజుండు.

శా. బాలార్కద్యుతి నగ్గుహాంతరమున న్భాసిల్లు నారత్నమున్
లీలామానుషవిగ్రహుండు గని హాళిం జెంత కేతెంచి దా
కేలం బూనినఁ గాంచి యచ్చటిసఖుల్ క్రీడామణిన్వింతయా
నీలాంగుం డొక డంది పోయెఁ గనవే నిక్కంబుగా జాంబవా.

క. అని యరచిన జాంబవుఁ డా
మనుజేశ్వరుఁ దాఁకి యోరి మనుజాధమ నా
యనికికి వచ్చితి విక జీ
వనములతోఁ బోవ నీవు వశమెట్టులగున్.

గీ. జీవముల మ్రించి భక్షణ సేయువాని
వంట యిల్సొచ్చు కుందేలు వైతి విచట
నెటులు పోగలవింక నీ కెద్ది తెరవు
మత్ప్రతాపంబు వినవె భూమండలమున.

గీ. ఎఱుఁగ కిటు సేసికొంటి వింతెఱిఁగి యనుభ
వింపు మని వల్కి కృష్ణుని వెన్ను విరుగ
భీమబలుఁడైనభల్లూక విభుఁడు వొడిచె
నవ్విధంబున మోదె న బ్జాక్షుఁ డతని.

క. పాలివోక నిలిచి జాంబవుఁ
డలుక స్మరవైరి నెత్తి నడచిన కృష్ణుం
డిలకొరుగఁ ద్రోచి వానిని
బలువిధముల గృమ్మె భీమ బలమున నతఁడున్.

గీ. లేచి సాలంబు చేఁబూని లీల మెరయ
హరిని మోదిన నతఁడొక యసనిజంబు
వెదికి భల్లూకనాధుని యురము వగుల
నేయ నతఁడొక్క శిల గొని యేసె నతని.

శా. ఈరీతి న్బటుసత్వము ల్వెలయ నుగ్రాకారులై యిద్దఱు
న్బోరన్బోరఁగఁ దత్సమీపవిలస ద్భూజాశ్మసందోహము
ల్దూరంబై కనుపట్ట బాహుసమరో ద్యోగంబునం దాఁకి య
వ్వీరు ల్దుస్తరధైర్యశౌర్యమహిమా వేశంబుల న్గాంక్షచేన్.

గీ. సప్తవింశతిదినసము ల్సమర మిట్లు
సలిపి భల్లూకపతి హీన సత్వుఁడగుచు
మేన రుధిరము దొరుగ నున్మీలితాక్షుఁ
డై నతి యొనర్చి శౌరి నిట్లని నుతించె.

క. నారాయణ జగదీశ్వర
కారుణ్యసుధాబ్ధి విమల కంజాక్ష హరీ
శ్రీరమణీప్రియ దుష్టవి
దారణ వైకుంఠవాస దైత్యవినాశా.

సీ. ఆదిదేవ ముకుంద హరిహరాత్మక కృష్ణ పద్మనాభాచ్యుత పరమపురుష
వైకుంఠ సర్వేశ వాసుదేవ మురారి శౌరిపీతాంబర శార్ఙ్గహస్త
వనమాలి కౌస్తుభవక్ష దామోదర కలితచక్రాయుధ ఖడ్గపాణి
గోవింద మధువైరి కుంజరార్తివిదారి దేవకీనందన దీనపోష

గీ. పుండరీకాక్ష మాధవ పుణ్యపురుష
నారదాదిమునీంద్రహృ న్నళినభృంగ
శ్రితజనావన పావన శేషశయన
వేదవేద్య పరాత్పర విశ్వరూప.

క. దేవర త్రేతాయుగమున
రావణు వధియించి పక్షిరథునకు సుతుఁగా
నావిర్భవించి సీతా
దేవి వరించితిరి రామదేవుఁ డనంగన్.

క. జనకాజ్ఞఁబూని సతితో
ననుజునితో విపినములకు నరుదెంచియు రా
వణుచే జనకజఁ గోల్పడి
వననిధి బంధించుతఱిని వానరతతితోన్.

గీ. ఏను భల్లూకసేనతో నేగుదెంచి
యబ్ధి బంధించి లంకకు నరుగుదెంచి
రావణు వధించి దేవర రమణితోడ
సంతసంబునఁ బురి కేగు సమయమునను.

గీ. బుద్ధిజాడ్యంబునను జేసి పుణ్యమూర్తి
నిన్నుఁ గోరితి నొక్కటి నీభుజాబ
లంబు దెలియంగ మది నుత్సవంబుగల్గెఁ
బూని నాతోడ నెదిరించి పోరు మనుచు.

గీ. కోరునెడ ముందుఁ గృష్ణావతారమందుఁ
గల్గు నీకని పుత్తెంచి కంజనాభ
వచ్చితివి నేఁడు నాభాగ్యవశముచేతఁ
దెలియలేనైతి మూర్ఖత దేవ నిన్ను.

వ. అని మహాభక్తిం బలుకుచు లేవ శక్తుండు గాకున్న జాంబవంతుని శరీరంబు కృష్ణుండు దన కరంబున నిమిరిన వేదనారహితుండై లేచి మస్తకఘటితాంజలిపుటుండై

క. ఎఱుఁగక దేవర నిన్నీ
కరణిని మార్కొంటి దప్పు గా నెంచకు మో
మురహర యంచును దత్పద
సరసిజముల కెఱఁగి వినుతి సల్పి మహాత్మా.

క. నాకృత్యంబుల మఱవఁగఁ
గైకొనుమీ మణిని బుత్రికామణిని దయన్
లోకేశ యనుచు వేఁడిన
నాకృష్ణుఁడుఁ గొనియె మణిని నబలామణినిన్.

గీ. అట్లు కైకొని గుహదాఁటి యామురారి
సైన్యములఁ గాంచి మదిలోన సంతసించి
జాంబవంతుని వీడ్కొల్పి సత్వరముగ
ద్వారవతిఁ జేరె నమ్మణిద్వయముతోడ.

సీ. అటుచొచ్చి పౌరుల కదియెల్ల నెఱిగించి గురుమంత్రివరులతోఁ గొల్వుఁ దీర్చి
దామోదరుండు సత్రాజిత్తుఁ బిలువఁగాఁ బంచి ప్రసేను సధించి సింహ
మమ్మణిఁ గొనుటయు నాహరిఁ బొలియించి భల్లుకేశ్వరుఁడది పడయుటయును
దాను జాంబవునితోఁ దలపడి పోరుట మొదలుగా సర్వ మాభూమిపతికిఁ

గీ. దెల్పి మణి నిచ్చి నిక్కముఁ దెలిసికొనక
సాధుజనులను నిందింపఁ జన దటంచు
బోధ గావింప నప్పు డప్పుణ్యమూర్తి
కెరఁగి యపరాధి నని తెల్పి యేగె నతఁడు.

వ. ఇవ్విధంబునం బురంబునకుం జని హితామాత్యులతోఁ గొలు వుండి వారలకు
సర్వంబు నెఱిఁగించి

గీ. మాధవున కెగ్గొనర్చితి మణినెపమున
నెట్టు లాతని నలరింతు నెట్టు లతఁడు
వైరమును బూనకుండు దుర్భరవిషాద
మగ్నుఁడై యుండె నామది మంత్రులార.

సీ. అని విచారమునఁ బల్కిన నృపాలోత్తముఁ గని వృద్ధమంత్రి యి ట్లని వచించెఁ
దోఁచె నొక్కటి నాకుఁ దోయజాక్షుఁడు మెచ్చునట్టియుపాయ మోయవనినాథ
భామామణిని సత్యభామ నమ్మణితోడఁ గొనిపోయి కృష్ణదేవునకు నొసఁగి
కడువేడ్క నల్లునిగాఁ జేసికొన్న చో నెపుడు భక్తిఁ జెలంగు నెపములేక

గీ. భువనమోహనుఁ డైనట్టి పుణ్యమూర్తి
ప్రీతితో నీసుపుత్రి వరించు దేవ
దేవుపదములు గదుగుట దివ్యలోక
పదవి నొందుటగాదె భూపాలవర్య.

క. కావున మద్వాక్యముఁగొని
భావజశరసదృశసత్యభామామణి నా
గోవిందున కర్పింపుము
భూవర ని న్నెల్లజనులు వొగడుదు రనినన్

గీ. మెచ్చి మంత్రికి పసదనం బిచ్చి మహితఁ
దెచ్చి రమణీయభూషణ దీప్తు లెసఁగ
రథమదద్విపధేనుతురంగసుభట
కాండములతోడ నాందోళికమున నుంచి

క. భేరిమృదంగాదులు వెస
భోరున మొరయంగ ముదముఁ బొందుచు నృపుఁ డా
ద్వారవతిఁ జేరి కృష్ణున
కారమణీమణిని మణిని నర్పింపంగాన్.

గీ. వాసుదేవుండు మది మెచ్చి భాసురాంగిఁ
గొని శమంతకమణి నిచ్చి కువలయేశ
మనము రంజిల్లె నీసఖీమణిఁ గనంగ
వేర మణు లేలఁ గొనిపొమ్ము ధీర యనుచు.

వ. సస్నేహంబుగాఁ బలికి యొడంబరచి

గీ. పట్టణం బెల్ల తోరణ పఙ్క్తితోడ
వెలయఁ గావించి రంగవల్లులను దీర్చి
కదళికాస్తంభనిచయంబు గట్టఁ బంచి
పరిమళాంబులఁ జల్లించె మురహరుండు.

వ. ఇవ్విధంబున బురం బెల్ల మనోహరంబుగా నలంకారంబులు సేయించి మంగ
కరవేణువీణాదిగానవిశేషంబులు భేరీమృదంగకాహళపటహఢక్కానేక
ద్యవిశేషంబులుం జెలంగ సకలబంధుమిత్రామాత్యగురుయుక్తంబుగా
కక్కసుముహూర్తంబున

సీ. భల్లుకేశ్వరుని రాఁ బంచి శ్రీకృష్ణుండు విధిపూర్వకంబుగా విమలముఖుల
భాసురాంగుల జాంబవతి సత్యభామలఁ బరిణయం బయ్యె నచ్చరలు దివిని
బాడుచు నాడుచు బహుభంగుల నుతింప సురవరుల్ బుష్పము ల్గురియు చుండఁ
గశ్యపజమదగ్ని గౌతమాదులు శిష్యబృందము ల్గొల్వ సానందు లగుచు
గీ. స్వస్తిఁ జెప్పంగ సర్వదేశాధిపతులు
కానుకలఁ గొంచు శ్రీకృష్ణుఁ గమలనాభు
దేవకీసు మహామునఁ దేలియాడ
నారదుఁడు వీణమీటుచు నటన సలుప.
గీ. సకలజనములు దివసపంచకము నచట
నిండు వేడ్కల నుండిరి నీరజాక్షుఁ
డెల్లరకు వస్త్రమాల్యాదు లిచ్చి వారి
వారి నెలవుల కంపె స్వర్వాసు లలర.
సీ. తదనంతరంబ గౌతమకణ్వజాబాలిమౌద్గలవాసిష్ఠమందపాల
కౌండిన్యమైత్రేయగాలవశాండిల్యజైమినికశ్యపజామదగ్ని
అత్రినారదకౌశికాంగిరసాగస్త్య వ్యాసవిశ్వామిత్రవాలఖిల్య
పైలభరద్వాజభార్గవకుత్సమైత్రావరుణార్వదూర్వాసముఖ్య
గీ. మౌనివర్యులతో సభామంటపమున
నిండు కొలు వున్నతరిఁ గృష్ణు నీలవర్ణు
మాధవు ననంతు వినుతించి మౌను లెల్లఁ
బల్కి రిటు దేవదేవ దివ్యప్రభావా.
గీ. శాపగత శశిఁ గనుటచే సంభవించు
ప్రబలతర మగు నీలాపవాదభరము
నాదిదేవుండ వగుట నిన్నంట కుండ
వాపుకొంటివి మాదృశ తాపసులకు
చేకూరిన తద్భారం
బేకరణిని బాపుకొందు మెఱిఁగింపుము సు
శ్లోక దయానిధి మాధవ
శ్రీకర మధువైరి విబుధశేఖర యనినన్.

సీ. పరమాత్ముఁ డమ్మునివరులతో నిట్లను ఘనశమంతకమణిఁ గొని బ్రసేనుఁ
డడవి కేతెంచుట హర్యక్ష మాతనిఁ బొలియించుటయు దాని భూరిసత్వుఁ
డగుభల్లుకేశ్వరుం డణఁగించుటయు వాని దాఁకి దత్సుతశమంతకముతోడఁ
గొనివచ్చుటయు నృపకుంజరునకు మణి నిచ్చి సంతసమునఁ బుచ్చుటయును

గీ. నాతఁ డమ్మణి గొని మది నలరి సత్య
భామతో నిచ్చుటయుఁ గన్యఁ బడసి మరల
రత్న మొసఁగుట కన్యకారత్నములను
బరిణయం బైనమత్కథ భక్తితోడ

సీ. పఠియించినను విన్న భక్తితో నక్షతల్ శిరమునఁజేర్చిన తరమతులకుఁ
గాత్యాయనీశాపగతుఁ డైన యాసుధాకరుని గన్నను నింద కల్గఁబోదు
ఆయురారోగ్యపుత్రావాప్తి యగు ధనకనకసద్వస్తువాహనము లబ్బు
నిత్యకళ్యాణముల్ నిఖిలశత్రుజయంబు పాడిపంటలు గల్గి బరిఢవిల్లు

గీ. ననుచుఁ దెల్పిన మానీంద్రు లలరి కృష్ణు
వినుతిఁ గావించి సెలవుఁ గైకొని నిజాశ్ర
మములకును జేరి సుఖముల నమరియుండి
రనుచు సూతుండు దెల్పె నమ్మునులతోడ.

పంచచామర. సితోక్షరాడ్తురంగ చంద్రశేఖరా కృపాకరా
హతాసురప్రచండశూలహస్త నీలలోహితా
కృతాంతమర్దనాహిభూష కృత్తివాసశ్రీశివా
నతాఖిలామరార్తిహారి నారదాదిసన్నుతా.

గద్యము. ఇతి శ్రీమత్త్రిపురసుందరీకరుణాకటాక్షసంప్రాప్తకవితావిచిత్రా
ర్వేదవిద్యావిపినచైత్ర లోహితసగోత్రపవిత్ర నారాయణపౌత్ర సూర్య
నారాయణపుత్ర పార్వతీపరమేశ్వరసేవాపారాయణ శ్రీసూర్యనారాయణ
ప్రణీతం బైన యపనిందాపహరణం బనుప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము
సర్వంబును సంపూర్ణము. శ్రీ. శ్రీ. శ్రీ.

